# Ranageetham

***TELANGANA UDYAMA KAVITWAM***

*by*

***Dasoju Gnaneshwar***
Gmail - dasojugnaneshwar96@gmail.com

First Edition : February 2017



Rs. : 75 /-

Copies : 1000

Cover Design : **Kurella Sreenivas**

For Copies : Smt.D.Padma (Veena)
99121 38152
plot no. 141
Sri Shivasai Township
opp: 12th Police Battalian
G.P. Yellareddy gudem
mndal : Narketpally
Dist : Nalgonda
TELANGANA - 508254

Printed at :

# అంకితం



ఉపాధ్యాయుడుగా పనిచేసిన ప్రతివూరా
అక్షరోద్యమం చేసి...ఎనిమిది పదుల వయస్సులోకూడా తన
ఇంటినే గ్రంథాలయంగా మార్చి
పల్లెల చైతన్యమే ఉద్యమంగా యెంచి
భారత స్వాతంత్ర్యానంతర ఉద్యమాలెన్నింటిలోనో
కవిగా, రచయితగా, పత్రికాసంపాదకుడిగా, సామాజికవేత్తగా
ప్రత్యక్ష పాత్రధారియై
బతుకునంతా ఉద్యమంగా గడుపుతున్న
**పూజ్యశ్రీ డా॥కూరెళ్ళ విఠలాచార్యగారికి**
సకలవిధ ఉద్యమాభివందనాలతో...

## సూచిక

వేణు సంకోజు
కవి, విమర్శకులు
సెల్: 99484 19881

శ్రమాశ్రమం
ఎల్ఐజి-5, హెచ్‌బి కాలనీ
రాజీవ్ పార్కు దగ్గర
నల్లగొండ - 508001

# నెనరూ, త్యాగాల ఊపిరి తెలంగాణ

తెలంగాణ అంటేనే ఉద్యమాల తావు. తెలంగాణ కాయంనిండా ప్రవహించేదంతా ఉద్యమాల ఊపిరే. 1948 మొదలుకొని, ఆయా కాలాల పొడుగుతా యిక్కడ, ఈ నేలమీద జరిగినంతగా, బహుశా, దేశంలో ఎక్కడా యింతటి ఉద్యమాలు జరిగి వుండవు. విముక్తికోసం సాగిన సాయుధ తెలంగాణ పోరాటం, దానికి కొనసాగింపుగా యింకొన్ని ఉద్యమాల పిదప తలెత్తిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రోద్యమం, ఆ తరువాత పరివ్యాప్తమైన 'జైతెలంగాణ ఉద్యమం' అనేవి వొకదాన్ని మించి మరొకటన్నట్టుగా సాగినవి.

పోరాటశీలంతో కాలాల పొడుగుతా - చెరిగిపోని తార్కాణంగా నిలిచిన నేల ఈ తెలంగాణ. కనీవినీ ఎరుగని సాహసాలూ, త్యాగాలకు వేదికైందిది. ఎవరెవరు, ఎన్నెన్ని విధాలుగా యిక్కడి ఉద్యమాల్ని అణచి వేయాలని చూసినా, కపటోపాయాలు, 'ఛీకృష్ణ' మాయోపాయాలు పన్నినా, ఝూటా'కిరణాలు' తలెత్తజూసినా, అన్నింటినీ ఛేదించి, ఎదిరించి నిలిచింది తెలంగాణ. ఎన్నివిధాలైన అడ్డంకులు, కుట్రలు, కూహకాలు పన్నినా క్రూరంగా బలివేదికలను సిద్ధంచేసినా గెలిచి తీరింది తెలంగాణ ప్రజ. కోర్టుల బోనులూ, జైళ్ళ కటకటాలనే వాటి లెక్కేమిటని బరిమీదికెక్కి క్రూరుల నిర్గమింపజేసింది. వీరతెలంగాణను విజయపథాన నడిపింపగా సాగింది.

ఈ కవి (దాసోజు జ్ఞానేశ్వర్) ప్రకటిస్తున్నట్లు 'దేహం నేలకూలినా, ఆశయం ఫలించి ప్రకాశించి తీరింది. వీరుల ఆవేశం తెలంగాణమంతటా మహాచేతనమై

మరింత-మరింతగా పరుచుకుని పరివ్యాప్తమైంది. సముద్రాలంతటి ఘోషను పంటికింద అదిమిపట్టజాలిన యోధుడైన కాసోజు శ్రీకాంతాచారి త్యాగం వృథాకాలేదు. తెలంగాణ ప్రాణయుతంగా వున్నన్నాళ్ళు, బతుకమ్మ సిగలో శ్రీకాంతాచారి రూపం తంగేడుపువ్వు పసిడివర్ణంతో అలరారుతూ వుంటుంది. బంతిపువ్వై ఆతని నవ్వు సదా ప్రభాసించి తీరుతూనే వుంటుంది. అనితరసాధ్యమైన రీతిలో త్యాగాన్ని పంచిన వీరకిశోరమై ఆగామితరాలకాతడు అగుపిస్తూనే వస్తాడు. తరం వెంట తరాన్ని పదును పెడుతూనే వుంటాడు. త్రిలోకాలలో యేమోగాని, త్రికాలాలలో మాత్రం నిస్సందేహంగా, అనంత వర్తమానమై సతత హరితంగా నిలుస్తూ, అదృశ్యంగానే తెలంగాణతల్లిని కొలుస్తూవస్తాడు.

బతికినకాలంలో- ప్రజాకవి కాళోజీవలె, సిద్ధాంతకర్త ఆచార్య జయశంకర్‌లాగున జీవిత సర్వస్వాలనే కాదు, ప్రాణాలను తెంగాణకోసం త్యాగం చేయడమొక అత్యున్నత ఆదర్శమౌతుందని సవినయంగా, సగర్వంగా ప్రకటించినాడీ కవి. సబ్బండవర్ణాలు, వర్గాలు భవిష్యత్ తెలంగాణకనే త్యాగం చేయడానికి సర్వసన్నద్ధమై బరిలోకి దిగిన ఉత్తమోత్తమ సౌశీల్యతలను, అకళంక దీక్షానిరతులను కీర్తించినాడు.

కుట్రలూ, కూహకాలన్నవి బాహాటంగానేమీ జరుగవుకదా! విలోమ నీతులను, విషపాత్మపు చేష్టలన్నింటినీ ఎకసెక్కం చేసినాడందుకే. **'వలస తెలివి'**లో-

**"ఓ వలసాసామీ!**
**నీ జాత్కమంతా తిరగేసి మరగేసి ఎట్లజూసినా**
**తెలంగాణశెట్టుకువట్టిన సెదపురుగువే"** (పుట:5) అంటూ కసిగా మెసలినాడు.

**పేరుమార్చి పెండ్లిజేసినంత మాత్రాన**
**సొబావం మారంది సాపత్యం - ఎట్ల నిలుస్తద"**ని గల్లాపట్టి నిలదీసినాడు. వలసతెలివిని గురించి ప్రశ్నించడమే కాదు, బహుబాగా విప్పి

చూపినాడు కూడ. ఇసుంటోళ్ళ –

**"జాత్కమంతా తిరగేసి మరగేసి ఎట్లజూసినా**

**తెలంగాణశెట్టుకువట్టిన సెదపురు''**గసుంటుదేనని తేల్చి పారేసినాడు. విడాకులకు తావైనచోట యింకేమిగురం మిగిలుందని వాపోయినాడు.

**"పచ్చగున్నకాడల్ల పత్తిపురుగులెక్కన**

**రసంబీల్చెటోని''**తోని కలువదుగాక కలువదని ఖండితంగ తేల్చిపారేసినాడు (పుట:6). ఇంకా ముందుకెళ్ళి –

**"పొగాకు తోటలల్ల**

**ఎండిన దరిద్రపు పీనుగోలె "** ఏలాడేది లేదనుకొస్తాడు.

**"నా వూర్లను ముంచి, ఏర్లను మళ్లించి**

**ఎడమకాల్వనుఎండబెట్టింది''**క (పుట:6) చాలునన్నాడు. చివరకు–

**"వలస తెలివినంత సూసి సూసి**

**సోయి తెచ్చుకొని నిలేయంగనె**

**తెలంగాణోడు దేశద్రోహి"** (పుట:8) అన్నటువంటి విషపాతకాన్ని కసికొద్దీ ఎండగట్టి తీరినాడీ కవి.

ఉద్యమకాలంలో చోటుచేసుకున్న ఉగాది కవితలనుకూడా **'రణగీతాలు'**గా మలచుకున్నాడీ కవి.

**'అన్నదమ్ములమంటూ అక్కునచేరి అడుగు మిగల్చకుండా ఆక్రమించి'**న కూహకాన్నెండగట్టి **"గుల్లబారిన తెలంగాణ బతుకుల్ల విషాదగీతం"** కాలేనని కరాఖండిగా ప్రకటించి **"రణగీతా"న్ని** (పుట:11)పాడినాడు.

ఇక తెలంగాణ రాదేమోనని ఆత్మాహుతి చేసుకుని యువలోకం ఆత్మత్యాగాలకు పూనుకుంటున్నప్పుడు **"వద్దు బిడ్డా"** అని అర్థిస్తూ –

**"ఎక్కాల్సింది ఉరికొయ్యలు కాదు**

**విజయసోపానా''**లంటూ, ప్రాణం తీసుకోగల స్థైర్యం,

శక్తిసామర్థ్యాలను అంచనాకట్టలేనంతటి తెగువను ఉద్యమానికందించేందుకు బతికి వుండమని మార్గనిర్దేశం చేసినాడు. **'రణగీతం'**లో –

**"తెలంగాణ ఎంత విషాదంలో వున్నా**

**వినోదం పొందేరాజకీయాసురుల**

**అంతుచూసే ఆయుధంగా పదునెక్కుతున్నా"** (పుట:11) నంటూ ప్రకటిస్తున్నాడు దాసోజు. అంతటితోనే ఆగక **"నిగ్రహం కూలింది"** (పుట:12)లో – **"తప్పు జరిగేలా పరిస్థితుల్ని సృష్టించడం"** అసలు కూహకమని తేల్చి చెప్పినాడు.

**"నేలమీద – నీటిమీద**

**సర్కారు కొలువుకాడ**

**ఆక్టోపస్‌లా ఆవరించి తెలంగాణంతటిని**

**ఏడుపులపాయను చేసిన నీచుడా"**అని నిలదీస్తూ, యిక సహించేది లేదన్నట్టుగా –

**"మేం తొడగొట్టకముందే**

**తొవ్వ చూసుకుంటే మంచిదంట**"మని(పుట:15) తన కవితా కంచుకంతాన్ని మోగిస్తూ వచ్చినాడు.

ఇక – **"తెలంగాణ రాష్ట్రకాంక్ష తీరని తమ్ముళ్ళను**

**ఉరితాళ్ళకు వేలాడదీసిన**

**నడిమింటి దూలాని"**వంటూ(పుట:17)అవతలి ప్రాంతపు కిరాతకత్వం మీద కసిగా రోసినాడు కవి– **"జనచేతన సునామీ"**లో **'చేదైనా నిజమే పాడతాను'** అనే యింకో కవితలో –

**"ఈ పోలీసులు ఏ తెలంగాణ యూనివర్సిటీని**

**జలియన్‌వాలాబాగ్ చేయబోతున్నారో!"** అని ఆరా తీయజూస్తూ...

**"తెలంగాణలో ఎన్ని ఆత్మహత్యలు – కాదుకాదు**

**ప్రభుత్వహత్యల సంఖ్య చెప్పాల్సివస్తుందో!"**(పుట:19) అనే ఆవేదనతో –

**"కాలపురుషుని బలిపీఠం మీదికెక్కి**
**తెలంగాణ వచ్చేదాంక - ఇలా**
**తొలికోడినై కూస్తనే వుంటా"**(పుట:21) నంటున్నాడు మహావేశంతో.

ఊరిముందు, ఊరెన్కాతల మొదలుకొని, సర్వం హడప్, సర్వస్వం దోపిడీ చేసిన సీమాంధ్రుల కిరాతకత్వం మీద కసిగా లేస్తూ ఈ కవి, ఎంతకూ ఈ ప్రాంతాన్ని విడిచివెళ్ళని ద్రోహులమీద, బడావ్యాపారుల మీద విరుచుకు పడుతూ వస్తాడు. ఇక్కడి వారలను, ఇక్కడివారి భూముల్లోనే కూలీలను చేయడాన్ని; ఈ పట్నం ఫాక్టరీల్లోనేమో అక్కడివారికి యాజమాన్యాన్ని కట్టబెడుతూ, నిరుపేదలను పొట్టన బెట్టుకుంటున్నప్పుడిక భరించేది లేదని విక్రమించనారంభిస్తే యికతప్పక **"రాబందులా రాలిపోతవ్"** అంటున్న మూలవాసుల పక్షాన ఆవేశపూరితమైన కవితారచనకు లంకించుకున్నాడీ కవి.

**"దోసిందేదో దోసినవ్**
**అయ్యిందేదో అయ్యింది**
**నీ జాగలకు నీవెల్లు**
**లేదంటె నీవు**
**వెయ్యిగొద్దలను తిన్న**
**రాబందోలె రాలిపోతవ్"** అంటూ శపించి తీరినాడు.

హైదరాబాదు టాంకుబండ్ మీద 'మిలియన్ మార్చ్' సందర్భంగా వ్రాసుకున్న కవితలో - **"పండిట్ ఎగరేసిన పావురాల రెక్కలు విరిచే**
**కుట్రలు పన్నిన సీమాంధ్రుల కన్నా**
**ఆంగ్లేయులే నయమనిపించే ఈ పాలకుల**
**తరిమేద్దాం పద"** (పుట:26)అంటూ సర్వులకూ పిలుపునిచ్చినాడు.

**'తస్మాత్ జాగ్రత్త'** అనే కవితలో-

**"విసిగి విసిగి వేసారిన చోట 'సహనం'**

**వెంట్రుకకు వేలాడదీసిన మహాపర్వతం"** (పుట:27) అంటూ, ఆవేశానికి పరాకాష్టగా ఒక విభిన్నమూ, వినూత్నమూ అయిన కొత్త నిర్వచనం వంటి హెచ్చరిక జారీ చేస్తాడు.

**"కుహనా సమైక్యసభను ఢీకొని**

**వెన్నులో చలి పుట్టించిన**

**చంద్రగ్రహ శకలానికి"** (పుట:28) అంటూ, కానిస్టేబుల్ శ్రీనివాస్ యొక్క మహాసాహసాన్ని శ్లాఘించిన కవిత **"బహుత్ ఖూబ్...బహుపరాక్"** అన్నది.

**"జయశంకరుల దీవెనలు**

**శ్రీకాంత్‌ల ఆశలు ఫలించగ**

**బలిదానం గావించిన మన బంధువుల**

**ఆత్మలు శాంతించగ**

**ఇకనుండి 'కొత్త దీపావళి'**

**ఇప్పుడు మాకిక ప్రతియేడూ**

**ఆగస్టు పదిహేనుతో పాటు**

**జూన్ రెండుకూడా పండుగవుతుంది"** (పుట:37) అన్నటువంటి ధీరోదాత్తమైన ఆశంస, విశిష్టంగా చోటుచేసుకున్నదిందులో.

అట్లాగే – **"యుగాల పర్యంతం జగాన వెలిగే**

**మన తెలంగాణ తల్లికి**

**బతుకమ్మతో పూలహారతి"**ని సగర్వంగా సమర్పించినట్టి వివశత్వమూ అద్భుతంగా చోటుచేసుకుని మెరిసిందికూడా. అట్లాగే –

"ఈ ఉద్యమబాటలో జనం **'త్వమేవాహం'**

**అంటూ వడివడిగా వేస్తున్న అడుగులు**

**మీవే మీవే!"** నంటూ (పుట: 44) యింకో కవిత కూడా

ఆచార్య జయశంకర్‌గారిని గురించి చోటుచేసుకుని వుందిందులో.

చివరగా, **'కన్నీటి గానమా!'** అనే గేయకవితలో **'ఆత్మహత్యల తెలంగాణమా'** అన్నటువంటి పాదాలతోపాటు, **'మము నడిపే విజయ నినాదమా'** అన్నవి బీజాక్షరాలుగా ప్రతిధ్వనిస్తూనే వస్తాయి కాలాల పొదుగుతా; సమస్త తెలంగాణను ప్రదీప్తం గావిస్తూనూ వస్తాయి!

**తెలంగాణ స్ఫూర్తితో.....**

**నల్లగొండ**

**04-01-2017**

ఓమ్ సాయిరామ్

అభినవపోతన, సాహిత్యప్రపూర్ణ
**డా॥కూరెళ్ళ విఠలాచార్య**
ఎం.ఎ.బి.ఇడి.ఎం.ఫిల్.పిహెచ్.డి.
సెల్ : 99495 39765

సాయి సాహితీ కుటీరం
గ్రామం: వెల్లంకి
మం: రామన్నపేట
జిల్లా : యాదాద్రి భువనగిరి

# ధన్యుడను

సీ: పద్యగద్య కవిత హృద్యంగ రచియించె
చేయితిర్గిన కవిశేఖరుడవు
అధ్యాపనములోన ఆత్మీయతను జూపి
పాఠాలు చెప్పెడి పండితుడవు
వివిధ అంశాలపై వివరంగ రాస్తున్న
మాన్యతగల సద్విమర్శకుడవు
ఆత్మశుద్ధి కొరకు ఆరోగ్యముకొరకు
యోగ నేర్పెడి ఉత్తమోత్తముడవు

గీ: మీదు కృతి 'రణగీతి' నామీదనున్న
ప్రేమచే నిచ్చుటకు మీకభీష్టమయ్యె
ధన్యమయ్యె నా పుటుక సమ్మాన్యమయ్యె
మనమునిండ దాసోజు దీవెనలు మీకు

– కూరెళ్ళ

# కృతజ్ఞతలు

తెలంగాణ ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్ష తీర్చిన తుది ఉద్యమంలో నేనూ ఓ కవితాక్షరాయుధాన్ని అయినందుకు గర్వపడుతున్నాను. అరవయ్యేళ్ళ ఉద్యమంలో సుమారు పదిహేను వందలమంది యువతీ యువకులు బలిదానం చేశారు. వీరి త్యాగం మరువరానిది; ఆచంద్రతారార్కం నిలిచేది. వీరంతా మనకు ప్రాత:స్మరణీయులు. వీరిపై, నిలువెల్లా కలంగా రూపెత్తి నేను జీవించి ఉన్నంతకాలం కవితాశ్రు వులు రాల్చినా తీరని దు:ఖం. తెలంగాణ కవులదే కాక ప్రజలందరి బాధకూడా ఇదేనన్నది అక్షరసత్యం.

దగాపడ్డ తెలంగాణ గురించి, ఉద్యమంలో జరిగిన కొన్ని సంఘటనల గురించి, అమరుల (కాళోజీ, జయశంకర్, శ్రీకాంత్) గురించి, ఉద్యమకారుల సాహసాల గురించి రాసిన కవిత్వం తప్పక వెలుగుచూడాల్సిందే, వారికి అక్షరనివాళులు అర్పించాల్సిందే– అన్న సంకల్పంతో **మిత్రులు, సహోపాధ్యాయులు, అభ్యుదయ భావుకులు, తెలంగాణ ప్రేమికులు శ్రీ సోమవరపు రాములు**(స్కూ.అ.తెలుగు, జి.ప.ఉన్నత పాఠశాల–చండూరు), **మా బావ, ఉన్నత ఆధ్యాత్మిక సంపన్నులు, గుప్తదాతలు శ్రీ కూరెళ్ళ వెంకటేశ్వర్లు** (విశ్రాంత ఉ పాధ్యాయులు), **ధార్మిక సంపన్నులు, తెలుగు అధ్యాపకులు, కవి శ్రీ పొద్దుటూరి రాజలింగం**గారలు మరియు వారి కుటుంబసభ్యుల సౌజన్యం, తెలంగాణపై వారి ప్రేమ, ప్రత్యేక రాష్ట్రం సిద్ధించిదన్న వారి ఆనందం మరియు వారి ఆర్థిక సాయం ఫలితమే నా కవితల సమాహారం ఈ గ్రంథరూపంలో రావటానికి కారణం. వారికి నా కృతజ్ఞతలు ఎలా

చెప్పినా, ఎంత చెప్పినా తక్కువే.

“నెనరూ, త్యాగాల ఊపిరి తెలంగాణ”గా ముందుమాట రాసిన తెలంగాణ ఉద్యమ నాయకులు, కవి, రచయిత, విమర్శకులు, సామాజిక ఉద్యమకారులు, నిత్యచైతన్యశీలి **శ్రీ వేణుసంకోజు**గారికి...

జీవితాన్నే సకలవిధ ఉద్యమాల వేదికగా మార్చుకున్న కవికులగురువు డా॥కూరెళ్ళ విఠలాచార్యగారు నా **‘రణగీతం’** ను అంకితంగా తీసుకోవటానికి అంగీకరించినందుకు...

సాహితీరంగంలో నాకెంతగానో సహకరిస్తున్న **‘తేజస్విని’** సాహిత్య సాంస్కృతిక సంస్థ అధ్యక్షులు **శ్రీ పెందోట సోము** గారికి, అచ్చును సరిచూసిన మిత్రులు **శ్రీ సాగర్ల సత్తయ్య**గారికి, **శ్రీ పెరుమాళ్ళ ఆనంద్**గారికి ...

ఇందలి ఉద్యమకవితలను అచ్చువేసి పరిచయం చేసిన ‘‘వీరతెలంగాణ’’, నమస్తే తెలంగాణ పత్రికల సంపాదకులకు, తెలంగాణకవితకు ప్రత్యేక కాలమ్ ఏర్పాటు చేసి దీక్షగా ముద్రించిన నాటి జిల్లాయూనిట్ ఇంచార్జ్ శ్రీపాలకూరి అశోక్‌గారికి మరియు సమస్త సిబ్బందికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్రోద్యమంలో బలిదానాలు గావించిన వీరులకు జోహార్లు.

ఉద్యమంలో పాల్గొన్న సబ్బండ వర్ణాలవారికి, వర్గాల వారికి, పోరాటయోధులకు వందనాలు.

## అఖండ దీపం

దేహం నేల కూలినా
నీ ఆశయం నక్షత్రమై ప్రకాశిస్తుంది
'జై తెలంగాణ' అనే నీ నినాదం
దిగంతాలలోనూ ప్రతిధ్వనిస్తుంది
నీ ఆవేశం
వీరులగన్న తెలంగాణ జాతికి చేతనం
నీ మేధోమథనం
నెట్టివేయబడిన మా చీకటి జీవితాలకు
వెలుగు దివిటీ
పరాయి పాలకుల క్రౌర్యాలపై
అలవిమాలిన అక్రమాలపై
మరుగుతున్న నీ రక్తం
పెల్లుబుకుతున్న ఇంధనం

వీరుడా శ్రీకాంతాచారీ!
ఇన్ని సముద్రాల ఘోషను
ఇన్నాళ్ళు ఎలా భరించావ్
తమ్ముడా శ్రీకాంతాచారీ !

ఫెనుతుఫానుల అలజడిని
ఇంత పిడికిట్లో ఎలా బంధించావ్!?

అమరుడా!
మా జీవితాల్లో దీపం వెలిగించడానికి
కోరి నిప్పురవ్వను ముద్దాడినావా!?
వెనుదిరిగి ఉద్యమానికి వెన్నుచూపరాదని
కాల్చుకుని కాకపుట్టించినావా!?
ధీరుడా! నీకు ఉద్యమాభివందనాలు
కనని వినని సాహసంతో
నిన్ను నీవు 'వత్తి'గా తాల్చుకొని
అఖండదీపంగా వెలిగించుకున్న
అమరుడా నీకు సలామ్!

భూమి మీద తెలంగాణ ఉన్నన్నాళ్ళు
బతుకమ్మ శిఖలో నీ త్యాగం ఎఱ్రమందారమై
మహోజ్వలంగా వెలుగుతూనే ఉంటుంది
తంగేడు పూలలో నీ నవ్వు
జ్వాజ్వల్యమానమౌతూనేవుంటుంది
'జై తెలంగాణ' అంటున్న అప్పటి నీ నినాదం
అనుక్షణం మా గుండెల్లో మార్మోగుతూనే  వుంటుంది!

## వద్దు బిడ్డా !

బిడ్డా!
ఎక్కాల్సింది ఉరికొయ్యలు కాదు
విజయ సోపానాలు
కాల్చివేయాల్సింది  మీ ఒంటిని కాదు
గోడమీది పిల్లుల స్వార్థాన్ని
ప్రాణం తీసుకోగల తెగువను
ఉద్యమానికి అందించు
నీచులు నీరుగారుస్తున్న ఉద్యమానికి
ఊపిరిలూదు, ఉసురు తీసుకోకు

కాళోజీలా, జయశంకర్‌లా
జీవితాన్ని త్యాగం చేయి
ప్రాణాలు కాదు

ఆడామగా
పిల్లాజెల్లా
మసలీముతకా
ఉద్యోగులు, సద్యోగులు ఒకరేమిటి
సబ్బండ వర్ణాలు
మీ భవిష్యత్తు కొరకే రోడ్డెక్కారు

నేడు కాకున్నా రేపు
రేపు రాకున్నా ఎల్లుండి
వచ్చి తీరుతుంది తెలంగాణ
తీరా వచ్చాక నీవు లేకపోతే
ఆ శూన్యాన్ని ఎవరు పూడ్చగలరు?
మేమేం చేసి
విజయదరహాసాలను
ఎవరి పెదాలపై పూయించగలం
ఏదో ఒకనాడు తెలంగాణ వచ్చి
సకలజనులు సంబరాలు చేసుకుంటుంటారు
మీ అమ్మానాన్నలు మాత్రం
మీ సమాధుల మీద వాలిపోతారు
ఆత్మహత్యలు వద్దు బిడ్డా!

తెలంగాణ వచ్చాక
నీవూ, నేనూ, మీ అమ్మా
ఒకేచోట, ఒకే చౌరస్తాలో నిలబడి
ఒకేసారి 'జై తెలంగాణ' అనాలనుంది
నా కోరిక తీరుస్తావు కదూ? ఒట్టేసి
చెప్పు నాయనా!

07-06-2010

# వలసతెలివి

ఓనా వలసాసామీ! నీ జాత్కమంతా
తిరగేసి మరగేసి ఎట్లజూసినా
తెలంగాణశెట్టుకువట్టిన సెదపురుగువే

నిన్ను ఇంట్లకు రానిచ్చింది మొదలు
వాసాలు లెక్కబెడుతుంటె
నీకు నాకు సోపతి – ఎట్ల కలుస్తది?
పేరు మార్సి పెండ్లిజేసినంత మాత్రాన
సొబావం మారంది సాపత్యం – ఎట్ల నిలుస్తది?
మన మద్దెన నక్కకు నాగలోకానికున్నంత తేడుంటె
ఇడాకులకుగాకుంట యింకేమిగురం మిగిలిందని?

గుండెను సెరువుజేసుకొని
బతుకొచ్చిన పతోన్ని
శాపపిల్లలాగ సూసుకొనేది నేను
ఎండ్రకిచ్చలాగ జేరి పొలంల
బుంగలు పెట్టుకొనే దొంగవు నువ్వు
మా తాత ముత్తాతలు
బొట్టుబొట్టుగ రగుతం గార్సిన ఎర్రనేలలల్ల
వానపామునై తిరిగెటోన్ని నేను
పచ్చగున్న కాడల్ల పత్తిపురుగులెక్కన
రసం బీల్చెటోనివి నువ్వు
నల్లరేగడి నేలలల్ల ఆరుద్ర పురుగునై
పండుమిరపతోని దోస్తాన జేసేది నేను
పొగాకు తోటలల్ల
ఎండిన దరిద్రపు పీనుగోలె
ఏలాడేది నువ్వు

శెరిసగం పారిచ్చుకుందామంటె నమ్మి
నా భూమిల ప్రాజెక్టులు కట్టనిచ్చింది నేను
నా వూర్లను ముంచి, ఏర్లను మల్లించి
ఎడమకాల్వను ఎండబెట్టి
కుడికాల్వతొ కొల్లగొడ్తున్నది నువ్వు

ఎట్లనొగట్ల వచ్చిపడ్డ మర్రిత్తుకు
జగ్గలమద్దెన కాసింత జాగనిచ్చి
జాలితో సూసుకున్న తాటిబొత్తోలె నేను
గా బొత్తనే మొత్తంగా ఆక్రమించుకొన్న
వటవృక్షానివి నువ్వు

నమ్మినకాడ మోసపోయినందుకు
రెండు కండ్లను
నిండుకుండలుగ జేసుకుంటున్నోన్ని నేను
కత్తెరగ పదును పెడ్తున్నోనివి నువ్వు
సూసినవానె!
నీకు నాకు ఇంత వ్యత్యాసమున్నంక
మనమద్దెన సోపతెట్ల కుదుర్తదే?

ఏదొ కతసెప్పినట్లు
తలను నాకు పంచిచ్చి
పొదుగు దగ్గర పొందుగ కూసుంటివి
మొదలుకు నీళ్ళు నాతోని పోయించి
కొమ్మల పండ్లు నువ్వేరుకుంటివి
"వలస తెలివి"నంత సూసి సూసి
సోయి తెచ్చుకొని నిలేయంగనె

“తెలంగాణోడు దేశద్రోహి” అంటూ
మొరగవడ్తివి

సమైక్యరాష్ట్ర సౌధంలో మోసంతో నువ్వు
మా బతుకుల్ల అమాసను అలుకుతుంటె
మమకారంతో నేను
వెన్నెలను పుదిచ్చుకుంటనే వుంటిని

ఇట్లున్నంక నీ మోసానికి నా మమకారానికి
సోపతింక ఏ లెక్కన కుదుర్తదే?
జరుగు జరుగు
ఇంక ఏ లెక్కనైనా
నీళ్ళమీదకన్న ముందు
నేలమీద హద్దులు గీసుకున్నంకనె!

వీరతెలంగాణ
అక్టోబర్ , 2010

# రణగీతం

చెట్టుచెట్టునా కొమ్మకొమ్మనా
విరబూసిన వసంతమా!
పల్లెపల్లెనా ఇంటింటా
ఉప్పొంగుతున్న ఉత్సాహమా!
లేతచిగురో, పూతవగరో
మేసిందేదైనా కమ్మగా పలికే కోకిలా!

గొడుగు పట్టిన మేఘసంచయమో
నల్లగా చిక్కని నీడగా అలుముకున్న
వనాంతర్భాగమో తెలియక భ్రమసి
తైతక్కలాడే మయూరబృందమా!
అణువణువునా నవనవలాడే చైతన్యమా!
ఏటేటా పలకరించే ఉగాది పర్వదినమా!
సాంప్రదాయికంగా ఇలా
పాడుతున్న పాటనే పాడలేనిప్పుడు
పాతకవుల కడుపునిండిన ప్రతీకలతో
వంధిమాగధుల తలదన్ని పొగడలేనిపుడు
అన్నదమ్ములమంటూ అక్కునచేరి

అడుగు మిగల్చకుండా ఆక్రమించిన
నేలమీద నిల్చున్న నిర్భాగ్యుణ్ణి నేను
కూలిన చెట్టునుండి రాలి ఎండిన పూవును నేను
వసంతం గురించి ఏమని పాడగలను?
జలాసురులు మళ్ళించిన నదిని నేను
తెలంగాణ బిడ్డల కళ్ళల్లో
ఆనందబాష్పమై ఎలా మెరువగలను?

జలపాతాలు ఇంకి, గిరులు చెదిరి
వనాలు తరిగి, చెరువులు ఎండి
తంగెడు, జిల్లెడు, మోదుగులు తప్ప మరేమీ లేని
మోడువారిన నా నేలతల్లి భవిష్యత్ గురించి
కవికోకిలనై ఎలా పాడగలను?
వగరు మేసినా కమ్మగా పాడే
పక్షికోకిలను కాదుకదా నేను?

చేదునే మేసి
ఇన్నాళ్ళు పంచమస్వరం పలికిన
ఈ కవికోకిల
తీపినే మేసి చేదును కక్కిన
దాయాదుల "కాకువు'కూతకై

ఎదురుచూస్తుంది
తీపి విరిగి చేదు పెరిగి
పులుపు తరిగి వగరు ముదిరి
ఉప్పుకారాలే నీళ్ళకుండల పప్పుచారై
గుల్లబారిన తెలంగాణ బతుకుల్ల
విషాదగీతమౌతున్నాను
ఫ్లోరైడ్ భూతానికి చిక్కిన
వృద్ధబాలల గురించే తలపోస్తున్నాను
తెలంగాణ ఎంత విషాదంలో వున్నా
వినోదంపొందే రాజకీయాసురుల
అంతుచూసే ఆయుధంగా పదునెక్కుతున్నాను
ఉగాదినాడూ ఉద్యమానికై
కొత్త ముహూర్తం వెదుకుతున్నాను
విజయపథగాములకు
అన్నిరోజులూ  అనుకూలమేనని
పంచాంగం పలవరిస్తుంది
ఈ కవికలం ఋతుగీతాలను కాదని
రణగీతాలను అల్లుతుంది

నవంబర్  2010

# నిగ్రహం కూలింది

నాల్గున్నర కోట్ల నా బిడ్డల
నిగ్రహాన్ని కూల్చినచోట
విగ్రహాలు కూలకేం చేస్తాయి?
బిడ్డలారా!

జరిగిందానికి దిగాలు పడాల్సిందేం లేదు
ఆత్మరక్షణలో అల్లల్లాడాల్సిన పనీలేదు
తప్పుజరిగేలా పరిస్థితుల్ని సృష్టించడం
నా అక్క గాంధారి పిల్లలకు
బహుబాగా తెలుసు!
నా పిల్లల్ని అనాథలచేసి
దాని పిల్లల్ని నెత్తిన పెట్టుకొని
ఇంకెన్నాళ్ళు మోయగలను?
దాశరథి, కాళోజీ, వట్టికోట, కొమురంభీం, ఐలమ్మ,
ఆరుట్ల, రావినారాయణరెడ్డి, ధర్మభిక్షం...
నా బంగారుకొండలు ఎందరులేరు?

గొడ్రాలునేం కాదునేను
అదేపనిగా నా అక్కపిల్లల్నే మోయడానికి
హుస్సేన్‌సాగర్ నా గర్భసంచి
ఇన్నాళ్ళకైనా
అవాంఛిత గర్భానికి
అబార్షన్ జరిగినంత హాయిగావుంది

'వీరతెలంగాణ' మాసపత్రిక
నెల.......

## మేం తొడగొట్టకముందే....!

బుడ్డగోచి పెట్టుకొని పొట్టచేత పట్టుకొని
తెలంగాణ గడపలో గోమాయువై నిలిచి
తెల్లారేసరికి మమ్ముల తెగముంచిన
దుష్టుడా! కోస్తాంధ్రుడా!
తలకెక్కి నను తొక్కిందాక
నిను వంచని తుంచని పాపం
నాదే నాదే! ముమ్మాటికి నాదే!

ఏటిలోన - చెరువులోన
ఇంటిలోని కడవలోన
నలుసులాగ చేరి నాచులాగ నిండినావురా
నయవంచకుడా! సీమాంధ్రుడా!
దశాబ్దాల నీ దాష్టీకం
చూస్తూ వూరుకున్న పాపం
నాదే నాదే! ముమ్మాటికి నాదే!

నేల మీద - నీటిమీద
సర్కారు కొలువుకాడ
ఆక్టోపస్‌లా ఆవరించి తెలంగాణంతటిని

ఏడుపులపాయను చేసిన నీచుడా సీమాంధ్రుడా!
కఫానివై కపాలానికెక్కి సలుపుతున్నా సహించిన పాపం
నాదే నాదే! ముమ్మాటికి నాదే!

మా వద్దకు చేరి మా ముద్దను చిదిమి
నోట మట్టిగొట్టి మా నొసటిగీతను తుడిచినావురా
ప్యాక్షనిస్టుడా! సీమాంధ్రుడా!
ఇంతదాక నిన్నిక్కడ మెసలనిచ్చిన పాపం
నాదే నాదే! ముమ్మాటికి నాదే!

సీమాంధ్రులారా!
ఎలుకల దండులా వచ్చి గరిసెలోన దూరినారు
ఇక భుజంగాలమై మిమ్ము వెంబడిస్తాం
నల్లుల్లా వచ్చి నాగుల్లా బుసకొడుతున్నారే
గద్దలమై తరిమి మా సరిహద్దును దాటిస్తాం
కాదు కూడదని మొండికేస్తే
కదనానికైనా కాచుకున్నోళ్ళం
మేం తొడగొట్టకముందే
తొవ్వ చూసుకుంటె మంచిదంటం!

**వీరతెలంగాణ ఫిబ్రవరి – 2011**

## జనచేతన సునామీ!

శ్రీ వికృతినామ సంవత్సరమా!
ప్రకృతికి విరుద్ధమైన నీకు
స్వాగతం ఎలా పలుకగలను?
నీరు, నేల, ఖనిజం, వనమ్ములాది
సమస్త ప్రకృతినంతా దాయాదులు
దోయగా దోయగా అరవయ్యేళ్ళుగా
నీవే కదా మాకు దర్శనమిస్తున్నది!

కొత్తగా ఇవ్వాళే వస్తున్నట్టు – నీకు
ఎలా పలుకగలను స్వాగతం?
కల్లబొల్లి మాటలు చెప్పి
తెలంగాణలో కలిసిపోయిన
సీమాంధ్రులు – వసంతుణ్ణి వలపన్ని
నీళ్ళతోపాటుగా తరలించుకుపోయిరి
నాటినుండి మాకుగాదులు లేవు, ఉషస్సులులేవు
ఇక నీకెలా పలుకగలను స్వాగతం?

లాఠీలు, తూటాలు, గూండాలు, నాయకులు
ఒక్కటై చేస్తున్న మూకుమ్మడి దాడిలో
నిలువెల్లా గాయమై, రక్త కాయమై
తెలంగాణ యూనివర్సిటీలన్నీ
మోదుగుపూల వనాలవుతుంటె
నీ రాకకై
కవికోకిలనై ఎలా పాడగలను?

నీవు  కామున్ని కాల్చివచ్చిన  ఉగాదివి కావు
నా తెలంగాణ తమ్ముళ్ళను
బూది చేసిన చితిమంటవు
మూరెడు కాడలతో వేలాడుతూ కనువిందుచేసే

మామిడి పిందెలతో వచ్చిన ఉగాదివి కావు
తెలంగాణ రాష్ట్రకాంక్ష తీరని తమ్ముళ్ళను
ఉరితాళ్ళకు వేలాడదీసిన నడిమింటి దూలానివి

షడ్రుచుల పచ్చడికన్నా ముందే
విషపానంచేసి విగతజీవులైన తెలంగాణ
విద్యార్థులను మోసుకొచ్చిన శవపేటికవు
ఇంత వికృతంగా ఎదురైన నీకు
స్వాగతం ఎలా, ఎలా పలుకగలను?
అయినా ఓ వికృతీ!
ఒప్పందాల మిషతో
ప్రభుత్వాలు నడుస్తున్న కాలం కాబట్టి
నీకూ షరతులతో కూడిన స్వాగతం!

తీరాన్ని మింగేసే సముద్రాక్రమణ ఆగిపోయి
హుస్సేన్‌సాగర్ గట్టున జనచేతన సునామీ పుట్టడం
నీ రాకపోకలకు సంకేతంగా నిలుపుతానంటే
నీ హయాంలోనే – తెలంగాణ వస్తుందంటే
నీకు స్వాగతం! సుస్వాగతం!!

**"గులేరు" ఉగాది ప్రత్యేక సంచిక**

**మార్చి 2011**

## చేదైనా నిజమే పాడతాను

రోజుకో పొద్దుపొడుపు
ఏ తెలంగాణ బిడ్డడి
ఆత్మహత్య గురించి వినాల్సివస్తుందో!
నెలకొక్క పున్నం
ఈ పోలీసులు ఏ తెలంగాణ యూనివర్సిటీని
జలియన్‌వాలాబాగ్ చేయబోతున్నారో!
ఏటేటా ఉగాది
తెలంగాణలో ఎన్ని ఆత్మహత్యలు – కాదుకాదు

ప్రభుత్వహత్యల సంఖ్య చెప్పాల్సి వస్తుందో!
శ్రీఖర నామ సంవత్సరమా!
చర్వ్రిత చర్వణంలా పంచమ స్వరంతో
నీకు స్వాగతం పలుకలేని
కవి కోకిలను నేను
ఎప్పటిలాగా మొహమాటం కొద్దీ
వగరుమేసి తియ్యగా కూయలేనిప్పుడు
అన్నెం పున్నెం ఎరుగని మా బతుకులల్ల
దొంగిలించిన వెన్నెల గురించి పాడతాను
ఇకమాకు మిగిలించిన
నెలకు రెండు అమావాస్యల గురించి
నికరంగా పాడితీరుతాను
తెల్లారితె – ఏ పోరగాని
ఆత్మహత్య వార్త వినాల్సివస్తుందోనని
పొద్దుపొడవకుండా మా తల్లి శపించబూనితె
ద్రోహులకిక దిగులు చీకటితప్ప
పగలే లేదని, ఉండకూడదని
పదిలంగా పాడతాను
ఎట్లనో తమాయించుకున్న దు:ఖం తోటి
పక్కనున్న మామిడి చెట్టును చూస్తె
ఉరేసుకున్న కొడుకుల్లా తోచి

వేలాడపడ్డ మామిడి పిందెల్ని తెంపలేక
తడిమి తడిమి చూసుకొని తల్లడమల్లడమైన
నా తల్లి కంటితడారని
తీరని దిగులు గురించి పాడతాను
పండుగపూట గుమ్మానికి నేను కట్టబోయే
మామిడి తోరణాలకన్నా ముందే
తన ఎడమకన్నును కుడివైపుకు
కుడికన్నును ఎడమవైపుకు వేలాడదీసిన
వైపరీత్యపు కళ్ళవైనాన్ని గురించి పాడతాను
ఇకనుండి వేదికేదైనా – వేదుకేదైనా గానీ
నా గురించి, నా తాతల తండ్రుల తరాల గురించీ
పదేపదే – అదేపనిగా పాడతాను
ఏదీ బాగులేకున్నా అంతా బాగున్నట్లు
ధృతరాష్ట్రగీతం పాడుతూ
ఆత్మవంచన చేసుకోలేనిప్పుడు

కాలపురుషుని బలిపీఠం మీదికెక్కి
తెలంగాణ వచ్చేదాంక – ఇలా
తొలికోడినై కూస్తూనే వుంటా.

**(శ్రీఖరనామ సం॥ము – ఉగాది కవిసమ్మేళనం)**

## రాబందులా రాలిపోతవ్

ఊరిముందు – ఊరెన్క
నిన్నక్కడ చెర్లుండేయి
ఇయ్యాల రియలెస్టేట్లయినయ్
కట్టలు కూల్చి కుంటలు పూడ్చి
చదరంగా చేసింది చౌదరి అండ్ సన్స్

ఊరిమద్దెన
నిన్నక్కడ మా పేదల గుడిసెలుండేయి
ఇయ్యాల అపార్ట్‌మెంట్ ఎలిసింది
రెడ్డి బ్రదర్స్ లేపిన బిల్డింగ్‌లవి

ముందుగాల్త ఊర్లమీదంగ
సర్కారోల్లు కొల్తలు తీస్కపోయుండ్రి
ఎందుకో  ఎంతడిగినా సెప్పరైరి
గద్దలోలె వచ్చిన ఆంధ్రోల్లు
అటుపక్క ఇటుపక్క భూముల్ని కొని
మజ్జెల్దెందుకు కొంటలేరొ అర్థంగాకపాయె
కాలువలు తీసి పొలాలు అచ్చుకట్టిందాక
అసలు సంగతి సోచాయించకనే పోతిని

నా బూమిల నేనే కూలోన్నయినందుకు
కంటికి మింటికి ఏడ్చి సగం పొలం తడిపితిని
పట్నం ఫ్యాక్టరీలల్ల ఆని కొడుకులు యజమానులాయె
నా బిడ్డలు రోజుకూలోల్లయిరి
ఔరా! ఆంధ్రుడా!
నీ తెలివి గూల!
నా తాతలు తోడిన చెర్లను
నా చేతుల్తోనే పూడిపించినవ్
నా అయ్య పాతిన గుంజల్ని
నాతోనే పీకించినవ్
ఇంటిపేరోతిగ
తాతల్నుండి వచ్చిన బూమిని

ఎకరాల సొప్పున అమ్మిచ్చి
గజాల లెక్కన కొనిపిచ్చినవ్
నా పక్కజేరి, గద్దెనెక్కి
నా బత్కును
పొక్కిలి జేసిందాక కాననైతిని
ఇదంతా నేను గుర్తించిన్నని నీవు గుర్తించి
మనం మనం తెలుగోళ్ళం తెలుగోళ్ళం
సమైక్యం సమైక్యం అని మొరగవడ్తివి
ఇక్కడా నమ్మకద్రోహమేనాయె?!
చేతుల్తో పేనుతున్న సమైక్యపు తాడును
కాళ్ళతో పురివిప్పుతున్న నీ పనితనానికి
హేట్సాఫ్!

దోసిందేదో దోసినవ్
అయ్యిందేదో అయ్యింది
నీ జాగలకు నీవెల్లు
లేదంటె నీవు
వెయ్యిగొొడ్లను తిన్న
'రాబందు'లా రాలిపోతవ్!

## తరిమేద్దాం పద

అరవయ్యేళ్ళుగ పరాయి పాలనతో మన
బతుకు బండికి ఇరుసు విరిగి
చీకటి గుహలో చిక్కిన జీవులం మనం
నింగి నీరు నేలకు దూరమై-బహుదూరమై
దు:ఖిస్తున్న మన తెలంగాణతల్లిని విముక్తి చేయగ
విప్లవ వీరుడ లే - లే - లే

కాసెను బిగించి కదం తొక్కుతు, పదం పాడుతు
మోహాలకు మోసాలకు లొంగక
లాఠీలకు తూటాలకు వెరువక
సకలజనులతో కలిసి సరసర బిరబిర
వేగిరమే సంకెలలు తెంచుకునే

సమరానికి యిక నడు – నడు –నడు

టాప్ టు బాటమ్ రుబాబుగా తెలంగాణలో
హద్దులు దాటి అందలమెక్కిన సీమాంధ్రులె యంతటా
నిరసన తెలిపిన మనల నిందితులను చేసి
జైళ్ళలో తోసి యుద్ధం ప్రకటించిన ఈ వేళ
ఎత్తిన పిడికిలి మరింత బిగించి ఉరుమై ఉరుముతు
మెరుపై సాగుతు కదం తొక్కు – తొక్కు – తొక్కు

గాంధీ చేతి కర్రను మారణాయుధంగా ప్రకటించి
ఆ మహాత్ముడి నవ్వును కూడా నిషేధించి
పండిట్ ఎగరేసిన పావురాల రెక్కలు విరిచే
కుట్రలు పన్నిన సీమాంధ్రుల కన్నా
ఆంగ్లేయులే నయమనిపించే ఈ పాలకుల
తరిమేద్దాం పద – పద – పద

(టాంక్‌బండ్‌మీద మిలియన్ మార్చ్ సందర్భంగా)

## తస్మాత్ జాగ్రత్త...!

కేంద్రప్రభుత్వ తీర్మానాన్నీ – ప్రతిపక్ష పార్టీల శీలాన్నీ
తెలంగాణప్రజల సహనాన్ని
ఏకకాలంలో పరీక్షిస్తున్న కిరణ్‌కుమారా!
అతి తెలివితో
ప్రమాదకరమైన ఆటను ప్రారంభించావ్
శీలాన్ని శంకించిన వానికి
క్షమాపణలున్నాయి
శ్రీరాముడు ధ్రువీకరిస్తున్నాడు
సహనాన్ని పరీక్షించినవానికి
శిక్షయేమిటో
శిశుపాలుడు చెప్పకనే చెబుతున్నాడు

విసిగి విసిగి
వేసారిన చోట "సహనం"
వెంట్రుకకు వ్రేలాడదీసిన మహాపర్వతం
పర్వతం కిందనిలబడి
ప్రగల్భాలు పలుకుతున్నావ్
తస్మాత్ జాగ్రత్త!

20-09-2013

## బహుత్ ఖూబ్....బహు పరాక్

కానిస్టేబుల్ శ్రీనివాసా!
తెలంగాణ ఆత్మాభిమాన  పతాకా!
వేదికపైని దుర్యోధన దుష్టసంతతి
తొండికూతలను వినలేక
వినకుండా ఉండలేక
మనసులో మసిలి మసిలి
తనువంతా రగిలి రగిలి
అర్జునుడి అక్షయతూణీరం నుండి
వెలువడిన స్వప్రయోగ రణన్నినాద బాణం నీవు

బుద్ధుడు నవ్వినట్లు పేలిన మందుపాతరవు
సీమాంధ్రుల పలుకు పలుకులోని కలవరపాటుకు
గొంతులోని వెరపుజీరకు
మాటలలోని వేగిరపాటుకు
భీతిల్లి బిగుసుకుపోయి తడారిన నాలుకలతో
తత్తరపడిన తీరుకు కారణమై
కుహనా సమైక్య సభను ఢీకొని
వెన్నులో చలి పుట్టించిన
చంద్రగ్రహ శకలానివి
భారతజాతి ముక్తకంఠంగా మోహనరాగమై
ఆలపించే రవీంద్రుని మంత్రాన్ని
ఉచ్చరించలేని దేశద్రోహాన్ని
బట్టబయలు చేసిన సింహబలమానసుడవు
బహుపరాక్! బహుపరాక్!

విద్యార్థీ బాలరాజు యాదవ్!
ధూర్తాతిధూర్త కౌరవ సైన్యం మధ్యన
తెలంగాణ తెగువచూపిన వీరాభిమన్యా!
వలవిసిరి, పట్టి, రెక్కలు విరిచి
బుట్టలో వేసుకునే
కసాయి సీమకిరాతకుల ముందు

శాంతి పావురమై ఎగరబోయావా!
అకారణ క్రౌర్యం నింపుకున్న వాణ్ణి
"పావురంగా" గెలువాలనుకోవడం ఎంత తప్పో
మరోమారు ఋజువుపడ్డది కదా బాలరాజా!

పగబట్టిన సర్పాల పడగలపై
ఫెటిల్లున తన్ని
విసురుగా ఆకాశానికెత్తి
ధడేల్మని నేలకు విసిరికొట్టే
గరుత్మంతులం కావాలని
ఇప్పటికైనా తెలిసిందికదా మిత్రమా!

(ఎల్.బి.స్టేడియంలో 'సమైక్య సదస్సు' సందర్భంగా సీమాంధ్రులు సృష్టించిన హింసాకాండకు స్పందించి.....)

# గద్దెమైసమ్మ

మా తెలంగాణ పల్లెలల్ల
బంగారు మైసమ్మ కట్టమైసమ్మ కోటమైసమ్మలు
బెల్లం సాక కల్లుసాకలకు
కొల్లలుగ వరాలిస్తరు

సమ్మక్క సారక్కల అవుతారమెత్తి
ఇంటిదేవతలై యాలనక, పాలనక
ఎనకెనకనే తిరుక్కుంట
సల్లంగ కాపాడుతుంటరు
కోడిపుంజులు, మేకపోతులు

బలిచ్చేది మా ఉపసమ్మతికే
మా మైసమ్మలు
ఏనాడైన కావాలని అడిగింద్రా?
లేకుంటె అలిగింద్రా?

ఆడుదన్నంగ, ఈడుదన్నంగ
సొట్టవడ్డ సెంబోలె దొల్లుకుంట వచ్చి
సస్తి నీకాల్మొక్తనని మా సంకలజేరి
పొద్దుగుంకెతాలికె సర్వం దోచిన సీమాంధ్రుడు
"అధిష్టాన దేవత"గా నిన్ను
ఏ సాకపోసి కొలుస్తున్నడో గాని
ఏ(నీ) అర్భకుని(కే)కో పట్టం కట్టడానికి
మా మనుషుల బలితీసుకుంటున్న
"గద్దెమైసమ్మ"వైతివిగద ఢిల్లితల్లి!

ఎదురునిల్చి తొడగొట్టుడే గాని
ఎనకగోతులు తీసెటోల్ల కనలె
మా తెలంగాణ తల్లి!
మీసం మెలేసి తుదకంటా పోరాడుడె కాని
తిమ్మిని బమ్మిజేసె గుంటనక్కల పెంచలె
మా వీరమాత!

నూనూగు మీసాలు మొలుస్తున్న
కోడెగాండ్రను ఏరుకొని ఏరుకొని
వెయ్యిమందికి పైగా బలితీసుకుంటివి

పడిగ మడిసి పడుకున్న పావోతిగ
ఇంకా పన్నాగం పన్నుతున్న ఓ ఢిల్లీ గద్దెమైసమ్మా!
మా వందమంది నాయకులు
పదవుల కుంభం పోసింండ్రు
నీకొడుకులసొంటి పోరగాల్లు
నిండు పానాలను బలిచ్చింండ్రు
నీ నోటి విసపుగ్రంథులు పగిలేదెన్నడు
మా తెలంగాణ మాకు విడుదలయ్యేదెన్నడు?

## అధికపీడనం

బంగాళాఖాతం తుఫానుగా
చిందులేయడం ఎంత సహజమో
హుస్సేన్‌సాగర్ కట్టమీద తెలంగాణ ఉద్యమం
సునామీలా చెలరేగడం
అత్యంత సహజాతిసహజం

జలసంద్రంలో అల్పపీడనం
జనసంద్రంలో అధికపీడనం
సునామీలను సృష్టిస్తుందని
మిలియన్‌మార్చ్
ట్యాంకుబండ్‌మీద నిరూపించింది

మీరెక్కాల్సిన పీఠాలపై
మమ్మల్ని నిలేసిన పాపానికి
పాల్కురికి, పిల్లలమర్రి, కందుకూరి రుద్రకవులకు – కవిత్రయం
దాశరథి, కాళోజీలకు – శ్రీశ్రీ
మాడపాటి హనుంతరావు, భాగ్యరెడ్డి వర్మకి – వీరేశలింగం
కొమురంభీమ్‌కు – అల్లూరి
మొదలగు వారు మొదలగు వారికి
క్షమించమని వేడుతూ సాష్టాంగపడుతున్నట్లుంది గానీ
కూల్చితే బొక్కబోర్లా పడ్డట్టున్నాయా!?
సీమాంధ్ర సోదరుల్లారా!
తప్పొప్పుల సమీక్షకు సమయం దాటింది
మీ విగ్రహాలను  మేం ప్రతిష్టిస్తాం
మా వెయ్యిమంది తెలంగాణ అమరులను, అమాయకులను
బతికించండి చాలు!
వారి తల్లుల గర్భశోకాన్ని చల్లార్చండి చాలు!
అప్పుడుగాని, కలిసుండే విషయం ఆలోచిస్తాం!

# నవ్య దీపావళి

అరవయ్యేళ్ళకల సాకారమవుతూనే
తొలిపొద్దు పొడిచింది
చీకట్లు విచ్చుకున్నాయి
వెన్నెల విరబూసింది
కొత్త రాష్ట్రంగా నా తెలంగాణ
ఆనంద సంద్రమై
ఉవ్వెత్తున ఎగిసిపడుతోంది
అయినా ఈ వేళ నా శిరస్సు
అమరవీరుల త్యాగం ముందు అవనతమవుతుంది
నా ఎద
గులాబీ గుత్తులుగా విప్పారి

వారి పాదాలమీద పొరలుతోంది
యుద్ధానంతర గంభీర ప్రశాంత వాతావరణంలో
నా ఆత్మ వారి ఆత్మలకు
శ్రద్ధగా అంజలి ఘటిస్తోంది

అమరవీరుల త్యాగం ఫలించగ
వీరమాతల– వీరపత్నుల
శపథం నెరవేరగ
అన్నదమ్ములమంటూనే అదమజూచిన
దుర్యోధన దుశ్శాసన కీచక జరాసంధుల
తొడలువిరిగి పీచయణగి పంగలుచీలి
తెలంగాణలో మలివెలుగులు ప్రసరించినవి
ఇప్పుడు మాకిక ప్రతియేడూ
ఆగష్టు పదిహేనుతోపాటు
జూన్ రెండుకూడా పండుగవుతుంది

జయశంకరుల దీవెనలు
శ్రీకాంత్‌ల ఆశలు ఫలించగ
బలిదానం గావించిన మన బంధువుల
ఆత్మలు శాంతించగ
ఇకనుండి "కొత్త దీపావళి"

ఇకపై మనభాష వెలుగు
మన యాస మురియు
మన భూముల్లో కృష్ణా గోదావరులు పారు

ఇకనుండి మన బతుకుల్లో
మన పిల్లల పిల్లల భవిష్యత్తంతా
నవ్యదీపావళి - భవ్యదీపావళి - దివ్యదీపావళి

యుగాల పర్యంతం జగాన వెలిగే
మన తెలంగాణ తల్లికి
బతుకమ్మలతో పూలహారతి

01-06-2014

## శత్రుశిబిరాల పైకి ప్రవహించే లావా

ఇది తెలంగాణం
ప్రపంచంలోని మేలిమెరుగులన్నీ
కుప్పబడిన మాగాణం
చుట్టూరా కొండలతో కొలువుదీరిన
రతనాల గని
కోటి కోహినూరు వజ్రాలసమం
మడికొండలో పుట్టిన మన కాళోజీ

కాళోజీని చూస్తే చాలు
తెలంగాణ దర్శనభాగ్యం కలుగుతుంది
కాళోజీని చదివితే చాలు
తెలంగాణ చరిత్ర తెలుస్తుంది
కాళోజీని వింటేచాలు
శీతలరక్తం కాస్తా
ఉష్ణకాసారమై మరుగుతుంది
శత్రుశిబిరాలపైకి
లావాలా ప్రవహిస్తుంది

ఒక్కొక్కరికి ఒక్కోరీతిగా భాసిల్లు
బహుముఖీన ప్రజ్ఞాశాలి
ఈ మన కాళోజీ
సర్వసమగ్ర ప్రాపంచిక సంస్కృతీ చిహ్నం
దూరం పాటించే మర్యాద వలువలను వదిలి
అందరితో ఆత్మాలింగనం చేసుకునే అద్వైతి

నిజానికి తప్ప ఏ ఇజానికి
తన భుజాన్ని తాకించనివాడు
ప్రామాణికంకాని దేనినీ అంగీకరించనివాడు
మానవత్వాన్ని మాయనీయనివాడు

మనమనే స్థాయికెదిగిన మాననీయుడు

రుధిరాన్ని జాతిచేతనకు ధారపోసి
మేధస్సును దేశభవిష్యత్తుకు అర్పణచేసినవాడు
మిగిలిన ఒక్క ఊపిరితిత్తితోనే
బడుగుల బతుకులకు ఊపిరిలూదినవాడు
తనువునంతా
విజ్ఞానశాస్త్రానికర్పించిన మహాత్యాగి
కలియుగంలో 'శరీరమాధ్యం ఖలుధర్మసాధనమ్'నకు
మహావాక్య ప్రతిపత్తినిచ్చిన మహాత్ముడు
మహాత్ముల ప్రబోధాలను
ఇంకెన్నాళ్ళు ప్రవచనాలుగా విందాం
"లేవండి" సమస్యలపై మనమే శంఖారావం పూరిద్దాం'
అన్న సంకల్పం కలిగిందంటే చాలు
కాళోజీ మనల్ని ఆవహించినట్లు
మహాభ్యుదయానికి మొదటి అడుగు
మనమే వేద్దాం పదండి ముందుకని సాగితే చాలు
కాళోజీ మనల్ని నడిపించినట్లు
నిజాన్ని తప్ప ఏ ఇజాన్నీ అంగీకరించక
కవితాసేద్యం చేసినపుడే
కాళోజీ మనలో అక్షరమై అంకురించినట్లు

పట్టపగలును నిశీథిని చేసి
నిట్టనిలువున దోచుకున్న
దొరలను దొంగలుగ నిలేసినపుడు
కాళోజీ గొడవతో మనం మమేకమైనట్లు!
నంగనాచిలా వచ్చి నట్టింట్లచేరి వాసాలు లెక్కించి
ఇల్లేనాదని రచ్చచేసిన
రౌడీమూకల తరిమికొడితే
కాళోజీ నిండుగా నవ్వినట్లు
మన తెలంగాణతల్లి మనవూరి మధ్యన
బతుకమ్మనాడినట్లు

కాళోజీ ఉత్సవ్ ప్రత్యేక సంచిక
2014

## చేతనగా మాలో...

తెలంగాణ వీణ ఒక్కటే
తంత్రులు నాలుగున్నర కోట్లు
ఒకేనాదంగా పలికించి
జయజయహే తెలంగాణగా
పల్లవించి పలవరించిన జయశంకరా!
మీరు అమరులైనారన్న వార్త వినగానే
పొరలుపొరలుగా కమ్ముకున్న
దు:ఖపు తెరలు....
నిరుత్తరులమై క్షణంసేపు
ఆగినా – మీ సందేశంతో సాగుతున్నాం
మా నోట నినాదమై

మోగుతున్నది మీరేనని
మా బిగించిన పిడికిటి శక్తి మీదేనని
మా గుండెల్లో నిండివున్నది
మీ సంకల్పబలమేనని
మా ముందువెనుకలు యుక్తిగా – శక్తిగా
నడిపిస్తున్నది మీరేనని గ్రహించాం
ఈ ఉద్యమబాటలో జనం "త్వమేవాహం"
అంటూ వడివడిగా వేస్తున్న అడుగులు
మీవే  మీవే!

భౌతికంగా మాకు దూరమైనా
చేతనగా మాలో చేరిన జయశంకరా!
మీకివే మా జోహార్లు!!

"వీరతెలంగాణ" మాసపత్రిక
జూలై, 2011

## మా సమస్తం తెలంగాణమే

పట్టిన పట్టు వీడని తెలంగాణ వాదులం
ప్రాణాలకు కూడా వెరువని తెలంగాణ యోధులం
కొలువుల మిఠాయిలకు
చంకలు కొట్టే
సన్నాసులం కాము
నిధుల ప్రలోభాలకు వలలో పడే
కక్కుర్తిగాళ్ళం కాము మేము
చిలుక పలుకులకు తలలూపే
గంగిరెద్దులమసలే  కాం
అన్నం పెట్టే వాళ్ళకు సున్నం పూసే

నయవంచకులం అంతకన్నా కాం
మంత్రి పదవులకు అమ్ముడుపోయే
నమ్మకద్రోహులు కొందరుండవచ్చుగాక!
మేము అమర వీరుల ఆశయాలను
అమలుపరిచే తెలంగాణ సమరవీరులం
మా బాట తెలంగాణం
మా మాట తెలంగాణం
మా పాట తెలంగాణం
మా ఊపిరి తెలంగాణం
మా ప్రాణం తెలంగాణం
మా సమస్తం తెలంగాణం
తెలంగాణమే మేం
మేమే తెలంగాణం

25-03-2013

## కన్నీటి గానమా!

ఆత్మహత్యల తెలంగాణమా
ఎదయెదను తొలిచిన గాయమా
పాడలేని కన్నీటి గానమా
అయినా మము నడిపే విజయనినాదమా ॥ ఆత్మహత్యల॥

తెలంగాణ ఉద్యమంలో ఆత్మహత్యల పర్వమొకటా
ధ్రుతరాష్ట్రుని దుష్టసంతతి పాలనాయే అకటా
కౌరవుల ప్రేతాత్మలే మరి గద్దెనెక్కె నిచటా
దుష్టపాలన అంతమొందగ పోరుసలుపుటె ముచ్చటా
॥ ఆత్మహత్యల॥

రణము దారిలొ సాగుచుంటివి కిరణదుర్యోధనా
కాంగిరేసులు వందమందికి బొత్స దుశ్శాసనా
రేణుకచౌదరి మీ చెల్లెలు తెలగాణమును మరిచెనా
ఉండవల్లీ నక్క వ్యూహాల శకుని మామనా ॥ ఆత్మహత్యల॥

తెలుగుదేశం కాంగిరేసుల దుష్టవ్యూహాన
లక్కగృహముగ మిగిలిపోయె నా తెలంగాణ
దొంగదెబ్బకు తాళలేక తెలంగాణ బిడ్డలూ
దాడనేలకూలీ పిడికిలెత్తిన అభిమన్యులయ్యారూ ॥ ఆత్మహత్యల॥

తెలంగాణ ప్రముఖకవి, రచయిత, అక్షరోద్యమ ప్రారంభకులు, సాహితీ కుటీరం నెలకొల్పి, తన నివాసం మొత్తాన్ని గ్రంథాలయంగా తీర్చిదిద్ది తన జీతం, (పెన్షన్ కూడా) జీవిత సర్వస్వం పల్లె ప్రజలకే అంకితం చేసి అన్ని వర్గాల వారికి స్ఫూర్తిగా నిలిచి సాగుతున్న **ఆచార్య డా॥కూరెళ్ళ విఠలాచార్యగారికి నా యొక్క 'రణగీతం' తెలంగాణ ఉద్యమకవితా సంకలనం అంకితం ఇస్తున్న సందర్భంగా నేను వారితో** జరిపిన *ముఖాముఖి:*

**నేను:** మీ జీవితమే ఓ ఉద్యమం అంటుంటారు; ఎందుకు? మీ నోటనే వినాలనిఉంది; తెలియజేస్తారా?

**ఆచార్యులు:** నేను ఐదు నెలలు ఉన్నప్పుడే మా నాన్నగారు దివంగతులయ్యారు. అప్పుడు మా అమ్మగారి వయస్సు పదిహేనేళ్ళని చెప్తారు. ఆనాటి నుండి మా అమ్మయే నాకు సర్వస్వం అయింది. చాలా కష్టాలుపడి నన్ను పెంచుకుంది. చిన్నప్పటినుంచీ జీవితం కష్టానికి పర్యాయపదమైంది. ఏదైనా నా జీవితంలో సాధించానంటే, అది ఉద్యమించి సాధించుకున్నదే. మచ్చుకు ఓ సంఘటన చెప్తాను. నా బాల్యదశ అంతా నీరునెములలో మా మేనమామ వద్ద గడిచింది. పదిహేనేళ్ళ వయసప్పుడు మా వూరు వెల్లంకికి వచ్చి మా పెదనాయన కూరెళ్ళ కనకయ్యగారిని నా భాగం నాకిమ్మని అడిగాను. కఠినాత్ముడు అయిన ఆయన నాకు వచ్చే భూమి, ఇల్లు ఇవ్వడానికి తిరస్కరించాడు. ఊర్లో ఉన్న పెద్దమనుషులు మా పెదనాయనకు భయపడి ఎవరు కూడా జోక్యం కలిగించుకోలేదు. ఆ కాలం అగ్రవర్ణాల వారి ఆధిపత్యంలో నడుస్తుంది. ప్రత్యేకంగా మా వూరు దేశ్‌ముఖ్ పాలనలో ఉంది. నా వయస్సు చిన్నదే అయినా భయపడకుండా మా వూరి హరిజనులతో మా పెదనాయనగారికి గుణపాఠం చెప్పించి నా భాగం నేను సాధించుకున్నాను. ఇలా నా చిన్ననాటినుంచి ఇప్పటి వరకు ఉద్యమించటమే నా స్వభావం అయ్యింది. ఉద్యమమంటేనే చెక్కుచెదరని విశ్వాసంతో అనుకున్నది సాధించుకోవటం కదా!

**నేను: మీరు మీ జీవితంలో ఇప్పటి వరకు చేపట్టిన ఉద్యమ కార్యక్రమాలేమిటి? వాటిని ఎక్కడెక్కడ మొదలు పెట్టారు? వాటి ఫలితాలేమిటి?**

**ఆచార్యులు:** నేను విద్యార్థిగా ఉన్నప్పటి నుంచి ఏ ఉద్యమం జరిగినా పాల్గొనేవాడిని. భువనగిరి విశ్వకర్మ హాస్టల్‌లో ఉండి చదువుకునేటప్పుడు రోజూ విశాలాంధ్ర దినపత్రిక చదివే వాడిని. అప్పటి ప్రభుత్వం కమ్యూనిస్టుల మీద నిఘా పెట్టింది. ఆ పరంపరలో పోలీసులు కమ్యూనిస్టుల పేపరైన విశాలాంధ్రను చదివితే హాస్టల్ ప్రవేశం రద్దు చేస్తామన్నారు. అప్పుడు పోలీసులను ఎదిరించి విశాలాంధ్ర పేపరును స్వేచ్ఛగా చదువుకున్న.

1954లోనే నేను విద్యార్థిగా ఉన్నప్పుడే నీరునెముల హనుమదాలయంలో నా సహచరులకు పంక్తి భోజనం పెట్టి అస్పృశ్యతా నివారణోద్యమం చేసి అగ్రవర్ణాల ఆగ్రహానికి గురయ్యాను.

1960లో ఇప్పటి యాదాద్రి మండలంలోని వడాయిగూడెంలో నేను ఏకోపాధ్యాయునిగా పనిచేశాను. అది ఓ కుగ్రామం. ప్రజలు చాలా వెనుకబడి ఉన్నారు. తల్లిదండ్రులు తమ పిల్లలను బడికి పంపడానికి ఇష్టపడేవారు కాదు. అప్పుడు ఇల్లిల్లూ తిరిగి పెద్దలకు చదువు చెప్తూ "చచ్చేముందు సంతకమన్నా నేర్చుకోవాలి" అన్న నినాదంతో అక్షరాస్యతా ఉద్యమం ప్రారంభించాను. బుర్రకథలు, నాటికలు రాసి ప్రదర్శించాను. నేననుకున్న సత్ఫలితాలు సాధించగలిగాను.

విద్యార్థులను భావిభారత పౌరులుగా తీర్చిదిద్దడానికి సృజనాత్మకశక్తి, పఠనాసక్తి వారిలో కలగడానికి ఉపాధ్యాయుడిగా, ఉపన్యాసకుడిగా ఏ స్కూలుకు, ఏ కళాశాలకు వెళ్ళినా వివిధ సంచికలను వెలువరించి పత్రికా ఉద్యమం నిర్వహించాను.

తెలంగాణ మలిదశ ఉద్యమం జరుగుతున్న సమయంలో నల్లగొండకు మంజూరైన విశ్వవిద్యాలయానికి తెలంగాణలో పుట్టిన మహాకవి పోతన పేరుపెట్టాలని 'నామసాధన సమితి' అధ్యక్షునిగా ఓ మహోద్యమం నడిపాను. ఇలా వివిధ ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించే అవకాశం కలిగింది.

**నేను: తెలంగాణ ప్రత్యేకత ఏమిటి? మీరు తెలంగాణవాదిగా ఎందుకు మారారు?**

**ఆచార్యులు:** తెలంగాణలో ముస్లిం పరిపాలన ఎంత ఆధిపత్యం చలాయించినా

తెలంగాణా వాళ్ళంగా మన భాషను, సాంప్రదాయాన్ని, సాహిత్యాన్ని కాపాడుకో గలిగాం. అదే తెలంగాణాకున్న ప్రత్యేకత.

నియంత నిజాంరాజు నుండి, రజాకార్ల రాక్షసత్వం నుండి విముక్తి అయిన తర్వాత, ఇక్కడ చదువుకున్న వాళ్ళు చాలినంతగా లేరని అప్పటి ప్రభుత్వం కలిగించిన అవకాశం కారణంగా ఆంధ్రులెందరో హైదరాబాద్ రాష్ట్రం వచ్చి తెలంగాణవారి ఉద్యోగాలు కాజేశారు. అప్పుడు (1952) ఆంధ్రులపై వ్యతిరేక ఉద్యమం వచ్చింది. ఆ సందర్భంలోనే 'ఇడ్లీ, సాంబర్ గో బ్యాక్, గోంగూర పచ్చడి గోబ్యాక్' అనే నినాదాలు పుట్టుకొచ్చాయి. ఈ ఉద్యమమే ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి నాంది అయ్యింది.

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత సాహిత్య, సాంస్కృతిక, విద్య, ఆర్థిక, సామాజిక పరంగా తెలంగాణను నిలువు దోపిడీ చేశారు. అందుకే ఆంధ్రులపై వ్యక్తిగతంగా ద్వేషం లేదు కాని, వాళ్ళ పాలనపట్ల మాత్రం వ్యతిరేకత ఉండి ప్రత్యేక తెలంగాణ సాధించుకొనడానికి నేను తెలంగాణవాదిగా మారాను.

**నేను:** తెలంగాణ ఉద్యమంలో కీలక పాత్ర పోషించిన వారెవరు?

**ఆచార్యులు:** తెలంగాణ ఉద్యమంలో ఆబాలగోపాలం అందరూ పాల్గొన్నవారే. అందరికీ స్ఫూర్తినిచ్చిన వారు మాత్రం, తెలంగాణకు తన సర్వస్వాన్ని ధారపోసినవారు, తెలంగాణకు సర్వస్వం అయినవారు ఆచార్య జయశంకర్ గారిదే కీలక పాత్ర. ఈ మన తెలంగాణ రావటానికి వీరంతా కారణమని ఓ కవిగా నా అభిప్రాయం:

**సీ: ఆత్మార్పణము జేసి అమరులైనట్టి మా**
**త్యాగమూర్తుల ప్రసాదంబు కాదె!**
**పుటుకంత తెలంగాణ పోరుకంకితమైన**
**జయశంకరులవారి జయము కాదె!**
**క్లవకుంట్ల చంద్రశేఖర మహోద్యమమూర్తి**
**దీక్షదక్షతకు ప్రతీక కాదె!**

**వెలగట్టలేని మా తెలగాణ వాదుల**
**పరమనిష్ఠకు తప:ఫలము కాదె!**
**ఢిల్లి కోటను దద్దరిల్లగ జేయ మా**
**పల్లెపాటలకున్న బలము కాదె!**
**మాట నిల్పుకొనిన మహనీయురాలు, మా**
**స్మరణీయ సోనియా వరము కాదె!**
**జనని తెలగాణతల్లి దీవెనలిడంగ**
**అమ్మ బతుకమ్మతల్లి ఆహ్లాదపడగ**
**ముగిసెనాంధ్రపాలన, మాకు ముక్తికలిగె**
**వీథివీథిలో తెలగాణ వెలుగుచుండె**
**నా తెలంగాణ కోట్ల రత్నాల వీణ!**

**నేను: ఒక్క పద్యంలో తెలంగాణ సాధనా చరిత్రనంతా చెప్పారు. మరి, తెలంగాణ ఉద్యమంలో మీరు నిర్వహించిన పాత్ర ఏమిటి?**

**ఆచార్యులు:** విద్యార్థిగా తెలంగాణ తొలి ఉద్యమం (1952)లో, ఉద్యోగిగా మలి ఉద్యమం (1969)లో, విశ్రాంత ఉద్యోగిగా తుదిఉద్యమంలో నా శక్తి మేరకు పాల్గొన్నాను. ధూంధాంలో పాటతో సమాంతరంగా నా పద్యాల ద్వారా ఉద్యమానికి స్ఫూర్తినిచ్చాను.

మా వూరు వెల్లంకిలో 'బతుకమ్మ తల్లి' అనే సంస్థను పెట్టి ఊరూరా ప్రదర్శనలిచ్చి ఉద్యమాన్ని బలోపేతం చేశాం. గ్రామం, జిల్లా, రాష్ట్రం – అన్ని స్థాయిల్లో ప్రముఖంగా పాల్గొన్నాను.

**నేను: ప్రత్యేకరాష్ట్రంగా తెలంగాణ ఆవిర్భవించింది కదా! ఇప్పుడు 'బంగారు తెలంగాణ' సాకారమయినట్లు భావించవచ్చా?**

**ఆచార్య:** ప్రత్యేక తెలంగాణ వచ్చింది. కాని, సామాజిక తెలంగాణ రాలేదని

చెప్పొచ్చు. తెలంగాణ మాత్రం బంగారు తెలంగాణ కాలేదు. కానీ బంగారు తెలంగాణ కావాలంటే ... ఈ మధ్యకాలంలో రవీంద్రభారతిలో ఏర్పాటు చేసిన కవిసమ్మేళనంలో 'బంగారు తెలంగాణ' కావడానికి ఈ పద్యంలో కొన్ని సూచనలు చేశాను.

సీ: చిట్టచివరివాని పొట్టనిండిన నాడు
ప్రత్యేక తెలగాణ పసిడి యగును
సంక్షేమ ఫలములు సఫలమయిన నాడు
వచ్చిన తెలగాణ స్వర్ణమగును
పల్లె పట్టులు పచ్చపచ్చగా కనిపిస్తె
కనుగొన్న తెలగాణ కనకమగును
ఆబాలగోపాలమంత సుఖపడితె
ఈ మన తెలగాణ హేమమగును

గీ: మాతలును, వృద్ధులును, అన్నదాతలున్ను
కార్మికులు, ధార్మికులు, కళాకారులున్ను
ఘనముగా సర్వజనము జీవనము చేస్తె
కాంతులిడు తెలంగాణ బంగారమగును

**నేను: బంగారు తెలంగాణ ఎట్లా అవుతుందో, ఎప్పుడు అనిపించు కుంటుందో బాగా చెప్పారు. పద్యానికి, కవిత్వానికి ఉన్న శక్తి మీ పద్యకవిత్వంలో నూటికి నూరుపాళ్ళు ప్రస్ఫుటమవుతుంది.**

**అయితే, నేటి తెలంగాణ యువతకు మీరిచ్చే సందేశం ఏమిటి?**

**ఆచార్య:** సుమారు ఆరు దశాబ్దాలు అవ్యాహతంగా పోరాటం చేసి సాధించుకున్న తెలంగాణను పరిరక్షించుకుంటూ, తెలంగాణ అభ్యుదయం కోసం అహర్నిశలు కృషిసల్పుతూ యువకులు తమ ప్రజ్ఞాపాటవాలను చాటాలి.

అందుకుగల శక్తి సామర్థ్యాలు భగవంతుడు అందించాలని కోరుతున్నాను.

**నేను: నా తెలంగాణ ఉద్యమ కవితాసంపుటి "రణగీతం"ను తమరికి అంకితమివ్వాలని కోరుకుంటున్నాను. దయతో అందుకు అంగీకరించి, దీనిపై స్పందన తెలియజేస్తారా?**

**ఆచార్య:** మీ విలువైన కృతిని నేను అంకితంగా స్వీకరించటానికి అర్హత ఉందో లేదో కాని, నా ఉద్యమజీవితం మిమ్మల్ని ఆకట్టుకున్నట్టు తెలుస్తుంది. ఏది ఎలా ఉన్నా మీ అభిమానమే ప్రధానకారణం. మీ తెలంగాణ ఉద్యమకృతి "రణగీతా"న్ని నాకు అంకితమివ్వడం వల్ల నా జీవితం ధన్యమయింది. మీకు నా ఆశీ:పూర్వక ధన్యవాదాలు. మీ ధర్మపత్ని పద్మకు, చిరంజీవులు శర్వాణీశ్రీవాణీలకు నా హృదయపూర్వక ఆశీస్సులు.

**శుభమ్**

**లోకాస్సమస్తాస్సుఖినోభవంతు**